టీక.

జ్ఞానవానపి = సదసద్వివేకజ్ఞానము కలవాడైనప్పటికిని, స్వస్యాః = స్వవిషయమైన, ప్రకృతేః = జన్మాంతరసంస్కారమునకు, సదృశం = అనుగుణముగా, చేష్టతే = సంచరించుచున్నాడు, భూతాని = సకలప్రాణులును, ప్రకృతిం = జన్మాంతరసంస్కారమును యాంతి = పొందుచున్నారు, (తతః = అందువలన), నిగ్రహః = ఇంద్రియజయమును, (లేక) నా యాజ్ఞయును, కింకరిష్యతి = ఏమిచేయగలదు.

Even the man of knowledge acts by virtue of his own nature (ప్రకృతేః); all beings go according to their nature. What shall prohibitary injunction avail.?

**Com.** భాష్యం.

కస్మాత్ పునః కారణాత్ త్వదీయం మతం నానుతిష్ఠంతః పరధర్మమను తిష్ఠంతి స్వధర్మంచ నానువర్తంతే త్వత్ప్రతికూలాః కథం నబిభ్యతి త్వచ్ఛాసనాతిక్రమదోషాత్॥ సదృశమితి॥ సదృశమనురూపం చేష్టతే కస్యాః స్వస్యాః స్వకీయాయాః ప్రకృతేః ప్రకృతిర్నామపూర్వకృత ధర్మాధర్మాది సంస్కారో వర్తమానజన్మాదావభివ్యక్తః సా ప్రకృతిః తస్యాస్సదృశమేవ సర్వో జంతుః జ్ఞానవానపి చేష్టతే కిముత మూర్ఖః తస్మాత్ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి మమవాన్యస్యవా దుర్నిగ్రహాప్రకృతిరితి వాక్యశేషః॥

For what reason do people do others' duties and neglect their own, disregarding thy teachings? Why do they who do not follow thy teachings, not fear the transgression of thy commands— The reason is given in this verse:—

సదృశః means suitable to; స్వస్యాః=one's own; ప్రకృతి or nature is the Samskara (the tendencies due to the impressions) of karma, done in past birth which manifests itself in the persent existence. In conformity with that nature or ప్రకృతి *even the man of knowledge* acts. Needless it to say that a foolish man acts according to his own nature. Therefore all beings go according to their own nature. Of what avail then is the command in the form of injunction, of me or anybody slse? The sense is that nature is uncontrollable.

## తాత్పర్యము.

లోకములోవారందరు భగవంతుడనైన నీయాజ్ఞానుసారముగా సంచరించక నీమతమును అవలంబింపనివారై స్వధర్మమును వదలుకొని పరమతమునుఅవలంబించుటకారణమేమని అర్జునుడు అడుగునేమోయనితలచి శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. సదసద్వివేకముకలవాడైనప్పటికిని తనయొక్క స్వభావప్రకారము సంచరించును. ప్రకృతి లేక స్వభావమనగా పూర్వజన్మమందుచేసిన ధర్మాధర్మముల వలన పుట్టినదియును ఈజన్మమునందు ఫలమునిచ్చుటకుగా అభివ్యక్తమైనదియును అయిన సంస్కారము. కాబట్టి నిషేధరూపమయిన నాయాజ్ఞ యేమిచేయగలదు సర్వజంతువులును ప్రారబ్ధానుసారముగ సంచరింతురు.

### *Notes*

ప్రకృతింయాంతి :— In several births man did karma, good and bad; the collective past karma is called సంచితం; Of the collective past కర్మ, that portion of karma which has begun to bear fruit, which is the cause of the present embodiment and which guides the present life is ప్రారబ్ధ; this ప్రారబ్ధ is one's own nature. This ప్రారబ్ధ cannot be averted by any body. It ends with the destruction of the body. "యాంతి=ప్రకృతిపదృశంచేష్టాంగచ్ఛంతి అనిచ్ఛన్త్యపిభూతాని" *i. e.*, Beings follow their nature even against their will.

---

ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్నవశమాగచ్ఛేత్తౌహ్యస్య పరిపంథినౌ ॥ 34

———:O:———

### టీక.

రాగద్వేషౌ = ఇష్టవస్తువునందలి ప్రీతియును, అనిష్టవస్తువునందలిద్వేషమును, ఇంద్రియస్యేంద్రియస్య = ప్రతీంద్రియముయొక్కయును, అర్థే = శబ్దాదివిషయములయందును, వ్యవస్థితౌ = ఉన్నవి, (కావున) హి = ఏకారణమువలన, తౌ = ఆరాగద్వేషములు, అస్య = ఈపురుషునికి, (అనగా మోక్షమునుగోరువానికి), పరిపన్థినౌ = (మేలునుపోగొట్టునవి అగుటచేత) శత్రువులో, (తత్ = ఆకారణమువలన), తయోః = ఆరాగద్వేషములకు, వశం = అధీనత్వమును, నగచ్ఛేత్ = పొందగూడదు.

Likes and dislikes towards sensuous objects abide in every sense. One should not become subdued by them, as they are impediments (in the way of knowledge).

——::o::——

**Com.** భాష్యం

యది సర్వ ఆత్మనః ప్రకృతేః సదృశమేవ చేష్టం తేనచ ప్రకృతిశూన్యః కశ్చిదస్తి తతః పురుషకారస్య విషయానుపపత్తేః శాస్త్రానర్థక్యప్రాప్తౌ ఇదముచ్యతే॥ ఇంద్రియస్యేతి॥ ఇంద్రియస్యేంద్రియస్య వీప్సాయామ్ ద్విరుక్తిః సర్వేంద్రియాణామర్థే శబ్దాదివిషయే ఇష్టే రాగః అనిష్టే ద్వేష ఇత్యేవం ప్రతీంద్రియార్థం రాగద్వేషావవశ్యం భావినౌ తత్రాయం పురుషకారస్య శాస్త్రార్థస్య విషయ ఉచ్యతే। శాస్త్రార్థే ప్రవృత్తః పూర్వమేవ రాగద్వేషయోః వశం నాగచ్ఛేత్। యాహి పురుషస్య ప్రకృతిస్సా రాగద్వేషపురస్సరైవ స్వకార్యే పురుషం ప్రవర్తయతి యదా తదా స్వధర్మపరిత్యాగః పరధర్మానుష్ఠానంచ భవతి యదాపునః రాగద్వేషౌ తత్ప్రతిపక్షేణ నియమయతి తదా శాస్త్రదృష్టిరేవ పురుషో భవతి న ప్రకృతివశః తస్మాత్తయో రాగద్వేషయోర్వశం నాగచ్ఛేత్। యతస్తౌ హ్యస్య పురుషస్య పరిపంథినౌ శ్రేయోమార్గస్య విఘ్నకర్తారౌ తస్కరావివ పథః॥

If all beings act in obedience to their own nature and if there is none that is devoid of one's nature, then there would be no roon for personal exertion and the Teachings of the sastra become objectless. The Lord answers in this verse.

As regards sense objects, such as sound &c, likes for agreeable sounds and hatred for disagreeable sounds do necessarily exist. Now it will be shown where personal exertion and the sastras operate. One who intends to follow the teachings of the Sastra, must not yield to affection and aversion. What we call the nature (ప్రకృతి) of a person prompts him to its course of action, through love or aversion. He then gives up his legitimate duties and follows others' duties. When on the other hand he controls love and hatred by means of its enemy, then he becomes mindful of the sastra only, not being subject to his nature. Therefore one should not fall under the control of love and hatred, as they are the obstacles in the path of Moksha, like thieves in the way.

## తాత్పర్యము.

లోకములో ప్రకృతికి లోబడనివాఁడే లేక, సర్వప్రాణులు ప్రకృతికి లోబడియున్నపక్షమందు పురుషప్రయత్నమునకు సావకాశముండదు శాస్త్రముయొక్క విధినిషేధములు వ్యర్థములగును అనిఅర్జునుఁడడుగునేమోయని తలంచి కృష్ణుఁడు ఈశ్లోకమును చెప్పుచున్నాఁడు. ప్రతిమనుజునిప్రకృతి ముందుగా ఇష్టములైన శబ్దాదులయందు రాగమును, అనిష్టములైనపుడు శబ్దాదులయందు ద్వేషమును గలుగజేయుచునే తనకార్యమందు ఆపురుషుని ఎప్పుడు ప్రవర్తింపజేయునో ఆ పురుషుఁడు తనధర్మమునువిడిచి అన్యధర్మావలంబనమును జేయును. శాస్త్రమునందుప్రవర్తించినవాఁడు గురువువలన వేదాంతశాస్త్రముయొక్క తత్వము దెలిసికొని జాగరూకుఁడై ముందుగానే రాగద్వేషములకు లోబడనివాఁడగుచున్నాఁడు. కనుక ఆచార్యోపదేశమునకును శాస్త్రమునకును ప్రవృత్తికలుగుచున్నది. ఎప్పుడు మనుజుఁడు రాగద్వేషములకు శత్రువైన వివేకజ్ఞానముచేత రాగద్వేషములను అణచుచున్నాఁడో అప్పుడు శాస్త్రమునెడి దృష్టిగలవాఁడే అగుచున్నాఁడుగాని ప్రకృతికి అధీనుఁడుకాఁడు. కాబట్టి మోక్షమార్గప్రతిబంధకములైన రాగద్వేషములను జయించుము.

### *Notes.*

Love and hatred for the objects of the senses abide in every sense. Every sense wishes to come in contact with the agreeable object and to shun the disagreeable object. One's own nature acts only through love or hatred. So love or hatred precede the performance of all actions. A man of murderous nature always likes to commit murders before he commits murder; he must have a liking for the act. So love for the act precedes the perpetration of the act. Before one's own nature operates, the wise man must control love or hatred; he will then be mindful of the sastra. Here lies man's undependent exertion and the Sastra's purpose. In the case of one who is under the sway of love and hatred, the Sastra will have no opdration, as he acts according to his natural inclination,

పరిపంథినౌ:— love and hatred for sensuous objects make a man unmindful of the teachings of the sastra and the instruction of the Guroo and thus lead him astray; the enemy:–knowledge and Viragyam are the enemies to false knowledge which is the origin of love and hate.

The sense of the verse is

విషయస్మరణాదినా రాగద్వేషప్రవృత్తౌ ద్యానవహితం పురుషమనర్థేऽతి గంభీరే స్రోతసీవ ప్రకృతిర్బలాత్ ప్రవర్తయతి శాస్త్రంతు తతః ప్రాగేవ విషయేషు రాగద్వేషప్రతిబంధకే పరమేశ్వరభజనాదౌ తం ప్రవర్తయతి తతశ్చ గంభీరస్రోతఃపాతాత్ పూర్వమేవ నావమాశ్రిత ఇవ నానర్థం ప్రాప్నోతి.

శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 35

టీక.

స్వనుష్ఠితాత్ = చక్కగానాచరింపబడిన, పరధర్మాత్ = ఇతరవర్ణాశ్రమములకుతగిన ధర్మముకంటె, విగుణః = గుణములేనిదైనను, స్వధర్మః = తనదువర్ణాశ్రమములకుతగిన ధర్మము, శ్రేయాన్ = శ్రేష్ఠమైనది, స్వధర్మే = తనయొక్క వర్ణాశ్రమములకు తగినధర్మమునందు, నిధనం = మరణము, శ్రేయః = ఉత్తమము, పరధర్మః = ఇతరవర్ణాశ్రమములకు తగిన ధర్మము భయావహః = (నరకపాతాదులచేత) భయమును కలిగించునట్టిది.

Better one's own duty though destitute of merit, than the duty of others well performed. Better is death in the discharge of one's own duty. The duty of another causes fear.

———— 0 ————

## Com. భాష్యం.

తత్ర రాగద్వేషప్రయుక్తః మన్యతే శాస్త్రార్థమప్యన్యథా పరధర్మోऽపి ధర్మత్వాదనుష్ఠేయ ఏవేతి తదసత్ ॥ శ్రేయానితి॥ శ్రేయాన్ ప్రశస్యతరః స్వధర్మః స్వకీయధర్మః విగుణోऽపి విగతగుణోऽపి అనుష్ఠీయమానః పరధర్మాత్స్వనుష్ఠితాత్ సాద్గుణ్యేన సంపాదితాదపి స్వధర్మే స్థితస్య నిధనం మరణమపి శ్రేయః పరధర్మే స్థితస్య జీవితాత్ తస్మాత్ పరధర్మో భయావహః నరకాదిలక్షణం భయమావహతీతి ॥

A man who is subject to love and hatred may misunderstand the sense of the sastra and say that he may follw the duty of another because that is also a duty. This is not right.

One's own duty though performed without merit is better than other's duty well performed and productive of merit. Better is death for one in the discharge of his duty than living while doing the duty of another; for, the duty of another leads to danger in the shape of hell &.c ,

—— o ——

తాత్పర్యము

రాగద్వేషములుకలవాడు శాస్త్రముయొక్క అర్థమును వేరుగాఆలోచించి ఇతరవర్ణాశ్రమధర్మములుకూడ ధర్మములేగనుక స్వధర్మములవలెనే అనుష్ఠింపదగినవేయని తలచుటన్యాయముకాదని ఈశ్లోకముచెప్పుచున్నది. లోపము లేకుండ ఆచరింపబడిన పరధర్మముకంటె కొంచము లోపములుకలుగునట్లుగా ఆచరింపబడిన స్వధర్మము శ్రేష్ఠము. స్వధర్మమును తిరస్కరించి పరధర్మమునవలంబించుటచేత స్వధర్మత్యాగదోషమును అందువలన నరకమును కలుగును. పరధర్మాచరణ చేయుచు జీవించుటకంటె స్వధర్మాచరణమందు చచ్చుట మేలు.

*Notes.*

విగుణః = devoid of గుణ or virtue.

స్వధర్మ.— Fighting is the duty of Kshathriya class to which Arjuna belongs. Mendicancy is allowable to Brahmin caste. Arjuna might say that mendicancy is as much a duty as fighting is, and that he would follow it. This verse is a reply to it.

అర్జున ఉవాచ.

అథ కేన ప్రయుక్తోయం పాపం చరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥ 36

టీక.

వార్ష్ణేయ = ఓకృష్ణుడా, అథ = అయితే, అయం = ఈ, పూరుషః = పురుషుడు, అనిచ్ఛన్నపి = ఇచ్ఛలేనివాడైనప్పటికిని, బలాత్ = బలాత్కారముగా, నియోజితఇవ = ని

యమింపబడినవానివలెనే, కేన = దేనిచేత, ప్రయుక్తః = ప్రేరేపింపబడినవాడై, పాపం = పాపమును, చరతి = ఆచరించుచున్నాడు.

Being prompted by what, O Varshneya, does a man perform sinful karma though unwilling, as it were by force constrained?

——— o ———

**Com.** భాష్యం.

యద్యపి అనర్థమూలం ధ్యాయతో విషయాన్ రాగద్వేషౌ హ్యస్య పరిపంథినావితి చోక్తం విక్షిప్తమనవధారితం చ యదుక్తం తత్సంక్షిప్తం నిశ్చితం చేదమేవేతి జ్ఞాతుమిచ్ఛన్ అర్జున ఉవాచ జ్ఞాతే హి తస్మిన్ తదుచ్ఛేదాయ యత్నం కుర్యామితి॥ అథేతి॥ అథ కేన హేతుభూతేన ప్రయుక్తస్సన్ రాజ్ఞేవ భృత్యః అయం పాపం కర్మ చరతి ఆచరతి పూరుషః పురుషః స్వయమనిచ్ఛన్నపి హే వార్ష్ణేయ బలాదివ నియోజితః రాజ్ఞేవేతి భృత్యో దృష్టాంతః॥

Although the source of evil has been shown in the verse "ధ్యాయతో విషయాన్ పుంసః..." (2 Ad. 62 V.) and in "ఇంద్రియస్యేంద్రియస్యార్థే" (3 Ad. 34 V.), in different ways, at different places, in a general way yet wishing to know in a concise and definite way that it is so, Arjuna asks. For, when it is known efforts would be made to erradicate it. Prompted by what, does a man do sinful karma though himself reluctant to do, like a servant by the order ofhis king?

తాత్పర్యము.

లోకములో ప్రతివాడును పాపము చేయను అనియెడు కోరిక లేనివాడైయుండియును బలాత్కారముగా రాజుచేత ప్రేరేపింపబడినవానివలె పాపమును చేయుచున్నాడు కారణమేమి? ఇదివరకే అ. 2. శ్లో. 62, అ. 3. శ్లో. 34. అను శ్లోకములచేత అనర్థకారణము అనేకస్థలములయందు అనేకవిధములుగా జెప్పబడినను, సంగ్రహముగాను నిశ్చయముగాను చెప్పబడినయర్థము అదే యని తెలిసికొనుటకు అర్జునుడు ఈప్రశ్నము చేసెను. అనర్థకారణము ఇదేయని నిశ్చయముగా తెలిసినయెడల దానిని పోగొట్టుకొనుటకు తగినప్రయత్నము చేయబడును.

*Notes*

బలాదివ:— Although people are not willing to do a particular act yet they are constrained to do it by the orders of the king. So a man though he knows a particular act to be siuful does it against his will.

అనర్థమూలం:— The source of evil is love and aversion.

వార్ష్ణేయ:—This epithet is used to denote that Krishna being born in వృష్ణి race to which Arjuna's mother belongs will kindly explain the truth to him; or the knowledge of the self which rains the supreme bliss is called వృష్ణి. The Lord that is comprehended by వృష్ణి (knowledge) is వార్ష్ణేయ.

---

శ్రీ భగవానువాచ.

కామఏష క్రోధఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణం ॥ 37

——: o. ——

టీక.

ఏషః = ఇప్పుడు నీచేతఅడుగఁబడిన హేతువు, రజోగుణసముద్భవః = రజోగుణము కారణముగాఁగల, కామః = కామము, ఏషఏవ = ఈకామమే, క్రోధః = (ఒకానొకనిచే ప్రతిహతమైన) క్రోధరూపముగా, (పరిణమతే = పరిణమించుచున్నది), (మఱియును) ఏషః = ఈకామము, మహాశనః = అధికమైనభక్షణముకలది, మహాపాప్మా = అధికమైన పాపమే స్వరూపముగాఁగలది, (కావున) ఏనం = ఈకామమును, ఇహ = ఈమోక్షమార్గమునందు, (లేక) సంసారమునందుండి మోక్షమునుగోరువానికి, వైరిణం = శత్రువునుగా, విద్ధి= తెలిసికొనుము

It is desire, it is wrath which is born of the quality of Rajas, which is a great consumer, and is of the form of great sin; know that to be the enemy here.

——::o.·——

**Com.** భాష్యం

శృణు తం వైరిణం సర్వానర్థకరం యం త్వం పృచ్ఛసీతి॥ శ్రీభగవానువాచ॥ శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః। జ్ఞానవైరాగ్యయో

శ్చైవ షణ్ణాం భగ ఇతీంగనా ॥ ఇతి ఐశ్వర్యాదిషట్కం యస్మిన్వాసుదేవే నిత్య మప్రతిబంధేన సామస్త్యేన చ వర్తతే ॥ శ్లో॥ ఉత్పత్తిం ప్రళయంచైవ భూతానా మాగతిం గతిం। వేత్తి విద్యామవిద్యాంచ సవాచ్యో భగవానితి ॥ ఉత్పత్త్యాది విషయఞ్జ్ఞానంచ యస్య సవాసుదేవో వాచ్యో భగవానితి॥ కామ ఇతి॥ కామ ఏష ఏష సర్వలోకశత్రుః యన్నిమిత్తా సర్వానర్థప్రాప్తిః ప్రాణినాం స ఏష కామః ప్రతిహతః కేనచిత్ క్రోధత్వేనైవ పరిణమతే అతః క్రోధోఽప్యేష ఏవ; రజోగుణస ముద్భవః రజశ్చ తద్గుణశ్చ రజోగుణః స సముద్భవో యస్య స కామో రజోగుణ సముద్భవః కామోహ్యుద్భూతో రజః ప్రతిపురుషం ప్రవర్తయతి తృష్ణయా హ్యహం కారిత ఇతి దుఃఖినాం రజః కార్యే సేవాదౌ ప్రవృత్తానాం ప్రలాపః శ్రూయ తే। మహాశనః మహదశనం యస్యేతి మహాశనః అతఏవ మహాపాప్మా కామేన హి ప్రేరితః పాపం కరోతి అతో విద్ధ్యేనం కామం ఇహ సంసారే వైరిణం ॥

The enemy of the world is desire which holds all the beings in its sway and which is the source of all evil in it. Desire is anger itself inasmuchas it manifests itself as wrath, when it is thwarted by some one. రజోగుణసముద్భవః means born of the quality of Rajas, or it may mean the source of the quality of Rajas For, desire generating the quality of Rajas prompts one to action. We hear miserable men engaged in servitude which is the effect of Rajas, say "I have been prompted to act by greedy desire". Desire is the great consumer as many objects are its food. It is therefore very sinful, for, men led by desire commit sins. Therefore know this desire to be the enemy in Samsara (ఇహ)

——.O:——

## తాత్పర్యము.

లోకములో ప్రతిమానవుడును పాపమును చేయతలయునని యెంతు కోర్కె లేనివాడైనను ఏకారణముచేత చేయుచున్నాడో కృష్ణుడీశ్లోకములో చెప్పుచు న్నాడు. కామము కారణము అది సర్వానర్థమును కలిగించునది. సర్వప్రాణులకు ను శత్రువు. కామము ఒకానొకనిచేత అడ్డుపరుపబడెనేని క్రోధరూపముగా బరి ణమించును. కామక్రోధములు రజోగుణమువలన గలిగినవి, లేక రజోగుణములకు

కారణములు. అనగా కామము పుట్టినతోడనే రజోగుణమును ప్రవర్తింపజేయుచు పురుషుని కర్మమునందు ప్రవర్తింపజేయును. కావుననే రజోగుణకార్యములగునే వారలయందు ప్రవర్తించినవాడు ఆశచేత కామముకలవాడనై ప్రవర్తించితి నని వ్యసనమునుపొందును. కామము యోగ్యత్వాయోగ్యత్వవిచారణలేకయే అనేకవిషయములయందు ప్రవేశించుటచేత మహాశనః అనిపిలువబడినది. కామము అధికమైనపాపస్వరూపము. ఏలననగా కామవశ్యుడు లోకములో పాపకర్మచేయును. కామము మోక్షమునకు శత్రువు.

---

*Notes.*

భగవాన్:—"ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసశ్శ్రియః ।
వైరాగ్యస్యాథ మోక్షస్య షణ్ణాం భగ ఇతి ॥"

One that possesses always the above six attributes or the following six is భగవాన్

"ఉత్పత్తింప్రళయంచైవ భూతానామాగతింగతిం
వేత్తి విద్యామవిద్యాంచ".

Desire and its modification wrath is the enemy of man and a great impediment in the path of Moksha It is a huge evil and is all sinful as under its sway the most heinous sins are committed. Desires are never satisfied by gratification "నజాతుకామః కామానాముపభోగేన శామ్యతి".

రజోగుణసముద్భవః:—The effect of Rajas is actvity, of Thamas is indifference and of Satwa is knowledge.

---

ధూమేనావ్రియతే వహ్నిర్యథాదర్శో మలేనచ ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతం ॥ 38

—:0:—

టీక.

యథా = ఏప్రకారముగాను, ధూమేన = (సహజమైన) పొగచేత, వహ్నిః = అగ్ని ఆవ్రియతే = కప్పబడుచున్నదో, యథా = ఏప్రకారముగాను, మలేన = మాలిన్యముచేత, ఆదర్శశ్చ = అద్దమున్ను, ఆవ్రియతే = కప్పబడుచున్నదో, యథా = ఏవిధముగాను, ఉల్బేన = మావిచేత, గర్భః = గర్భము, ఆవృతః = కప్పబడెనో, తథా = ఆప్రకారముగా, తేన = ఆకామముచేత, ఇదం = ఈజ్ఞానము, ఆవృతం కప్పబడెను.

As fire is enveloped by smoke, as a mirror is covered by dust, as the foetus uterus is wrapped up by the amnion, so *this* is enveloped by it.

—— o: ——

### Com. భాష్యం.

కథం వైరీతి దృష్టాంతైః ప్రత్యాయయతి॥ ధూమేనేతి॥ ధూమేన సహజేనావ్రియతే వహ్నిః ప్రకాశాత్మకః అప్రకాశాత్మకేన యథా చాదర్శో మలేన యథోల్బేనచ జరాయునా గర్భవేష్టనేన ఆవృతః ఆచ్ఛాదితో గర్భస్తథా తేనేద మావృతం ॥

In this verse Sree Krishna shows by illustrations how desire is the enemy. As fire which is self-luminous is enveloped by smoke which is non-luminous and co-existent.......

—— o ——

### తాత్పర్యము.

కామము సంసారమందు శత్రువని దృష్టాంతములచేత కృష్ణుడు చెప్పుచున్నాడు. సహజమైనదియును ప్రకాశరహితమైనదియును అయిన ధూమముచేత ప్రకాశాత్మకమగు అగ్ని ఆవరింపబడినట్లుగాను, మాలిన్యముచేత అద్దము, మావిచేత గర్భము ఆవరింపబడినట్లును, జ్ఞానము కామముచేత ఆవరింపబడెను.

### *Notes.*

Smoke is *dark and Co-existent* (సహజేనధూమేన); dust upon mirror is *incidental* (ఆగంతుకేన); a membrane covers an embryo *all round* (సర్వతోనిరుద్ధః). In all these three ways knowledge is enveloped by desire. Desire in its initial and natural condition exists along with the subtle Jiva which is the traveller in Samsara, from its ante-natal period and is therefore co-existent.

---

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేనచ॥ 39

—— :o:: ——

### టీక.

కౌంతేయ = ఓఅర్జునుడా, దుష్పూరేణ = దుఃఖముచేత నింపదగినదియును, అనలేన = తృప్తిలేనిదియును, కామరూపేణ = ఇచ్ఛారూపమైనదియును, జ్ఞానినః = జ్ఞానికి,

నిత్యవైరిణా = సర్వకాలములయందున్న శత్రువును, (అయిన) ఏతేన = ఈకామముచేత, జ్ఞానం = జ్ఞానము, ఆవృతం = కప్పబడెను.

Knowledge is enveloped by this constant foe of the wise, which is of the form of desire and is insatiable and satisfiable with difficulty.

——:'O'.——

**Com.** భాష్యం.

కింపునః తదిదం శబ్దవాచ్యం యత్కామేనావృతమిత్యుచ్యతే॥ ఆవృతమితి॥ ఆవృతం జ్ఞానమేతేన ఆవృతమేతేన జ్ఞానం జ్ఞానినో నిత్యవైరిణా జ్ఞానీ హి పూర్వమేవ జానాతి అనేనాహమనర్థే ప్రయుక్త ఇతి అతో దుఃఖీచ భవతి నిత్యమేవ తేనాసౌ జ్ఞానినో నిత్యవైరీ నతు మూర్ఖస్య సహి కామం తృష్ణాకాలే మిత్రమివ పశ్యన్ తత్కార్యే దుఃఖే ప్రాప్తే జానాతి తృష్ణయాహం దుఃఖిత్వమాపాదితఇతి న పూర్వమేవ అతో జ్ఞానినఏవ నిత్యవైరీ కింరూపేణ కామరూపేణ కామఇచ్ఛైవ రూపమస్యేతి కామరూపః తేన దుష్పూరేణ దుఃఖేన పూరణమస్యేతి దుష్పూరః తేనానలేన నాస్యాలం పర్యాప్తిర్విద్యత ఇత్యనలః తేనచ॥

What is the thing denoted by the word ఇదం (this) in the previous verse? the present verse gives the answer.

జ్ఞానినోనిత్యవైరిణా.—The man of wisdom knows that he was *prompted to do the evil act*, even before the enjoyment of the fruits of his action and so always feels sorry. Therefore desire is the constant enemy of the wise alone, not of the ignorant. For, the latter, at the time they cherish a desire for objects, regard 'desire' as their friend and when the painful results of their acts are experienced *then* only they know that they were led to that miserable plight by thirst, and not before; wherefore desire is the *constant* enemy of the *wise alone*. It is of the form of desire (ఇచ్ఛా). దుష్పూరేణ means filled or satisfied with great difficulty; అనలేన means that which does not know "enough" (అలం—satisfaction).

## Com. భాష్యం.

కిమధిష్ఠాయచ పునః కామో జ్ఞానస్యావరణత్వేన వైరీ సర్వలోకస్యేత్యపేక్షాయామాహ జ్ఞాతేహి శత్రోరధిష్ఠానే సుఖేన శత్రునిబర్హణం కర్తుం శక్యత ఇతి॥ ఇంద్రియాణీతి॥ ఇంద్రియాణి మనోబుద్ధిశ్చ అస్య కామస్యాధిష్ఠానం ఆశ్రయః ఉచ్యతే ఏతైరింద్రియాదిభిరాశ్రయైర్విమోహయతి వివిధం మోహయత్యేష కామః జ్ఞానమావృత్య ఆచ్ఛాద్య దేహినం శరీరిణం॥

If it be asked where desire which is said to be the enemy of all by reason of its enveloping knowledge, has its seat, the Lord replies that senses &c are the seat; for, if the seat of the enemy is known, it becomes possible to destroy it easily. అస్య means 'of the desire;' అధిష్ఠానః means 'seat'; ఏతైః means by the senses &c. which are its seat; ఏషః means desire: దేహినం means the embodied entity, ఆవృత్య means enclosed.

తాత్పర్యము.

ఇంద్రియములును, మనస్సును, బుద్ధియును ఈకామమునకు ఆశ్రయమని చెప్పబడును. ఆకామము ఈఇంద్రియములచేత జ్ఞానమునుకప్పి దేహాభిమానిని అనగా దేహమే నేనని తలచుమానవుని నానావిధములుగా మోహపెట్టుచున్నది.

*Notes.*

The seat of desire is given for two reasons; (1)without any place to stand upon desire cannot begin its operations. (2) If the seat of the enemy is known, he can be easily vanquished. "తస్య అధిష్ఠానం కథయన్ జయోపాయమాహ." "కామస్య నిరాశ్రయస్య కార్యత్వాభావం మత్వా కామాశ్రయం దర్శయతి".

తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।
పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనం॥ 41

## తృతీయోఽధ్యాయః

టీక.

హేభరతర్షభ = ఓ అర్జునుడా, హి = ఏ కారణమువలన, కామః = (ఇంద్రియమనోబుద్ధులు ఆధారముగాగల) కామము, విమోహయతి = మోహపెట్టుచున్నదో, తస్మాత్ = ఆకారణమువలన, త్వం = నీవు, ఆదౌ = మొదట, ఇంద్రియాణి = ఇంద్రియములను, నియమ్య = నిగ్రహించి, జ్ఞానవిజ్ఞాననాశనం = ఆత్మజ్ఞానమును, అనుభవజన్యజ్ఞానమును, (పరోక్షజ్ఞానమును, అపరోక్షజ్ఞానమును), నశింపజేయునదియును, పాప్మానం = పాపాచారములుకలదియును, (అయిన) ఏనం = కామమును, ప్రజహి = లెస్సగావిడువుము.

Therefore do thou, O best of the Bharatas, subdue the senses first and cast off this sinful thing which destroys Jnana and Vijnana.

---

**Com.** భాష్యం.

యతఏవం॥ యస్మాదితి॥ తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ పూర్వమేవ నియమ్య భరతర్షభ పాప్మానం కామం ప్రజహి పరిత్యజ ఏనం ప్రకృతం వైరిణం జ్ఞానవిజ్ఞాననాశనం జ్ఞానం శాస్త్రతః ఆచార్యతశ్చ ఆత్మాదీనామవబోధః విజ్ఞానంవిశేషతః తదనుభవః తయోర్జ్ఞానవిజ్ఞానయోః శ్రేయఃప్రాప్తిహేత్వోర్నాశనం నాశకస్తన్నాశనం ఆత్మనః పరిత్యజేదిత్యర్థః॥

ప్రజహి means abandon. హి means యస్మాత్ *i. e.*, because the desire seated on the senses & deludes in many ways,

తస్మాత్ – Therefore; ఏనం means the subject of the present discussion. Jnana is the knowledge of the self and other things derived from the Sastra and Guroo. Vijnana is the specific knowledge or personal experiences gained on Contemplation &c., after the acquisition of knowledge from the Sastra and the teacher. Throw off from you the destroyer of జ్ఞాన and విజ్ఞాన which are the means for the acquisition of Moksha, the highest good.

---

తాత్పర్యము.

ఏ కారణమువలన ఇంద్రియమనోబుద్ధులు ఆధారముగాగలకామము మోహపెట్టుచున్నదో ఆకారణమువలన నీవుముందుగా ఇంద్రియములను నిగ్రహించి పరోక్షాపరోక్షజ్ఞానములకు వైరియగు కామమును విడిచిపెట్టుము.

శ్రీమద్భాష్యము:

స్యాత్తేభ్యోహ్యాంతరోయం దేహినం ఇంద్రియాదిభిరాశ్రయైర్యుక్తః కామో జ్ఞానావరణద్వారేణ మోహయతీత్యుక్తం। సబుద్ధేర్ద్రష్టా పరమాత్మా ॥

It has been said that " first control the senses & c., and cast off the enemy, namely desire ". It will be shown here where one should rest and shake off desire; men of wisdom say that the five senses of hearing &c., are, in reference to their being more *subtle*, *internal* and *extensive in activity*, greater than the physical body which is gross, external and limited in the sphere of activity; likewise Manas which is composed of volition and doubt is superior to the senses. Budhi or understanding which is of the form of *determination* is superior to Manas. So He who is beyond all perceivable things ending with Budhi, and regarding whom, the resident in the body, it has been said that desire taking its stand on the senses &c deludes by way of enveloping wisdom, and who is the witness of all, is greater than Budhi.

తాత్పర్యము.

ఇంద్రియములను మొదటగా నిగ్రహించి శత్రువగు కామమును జయింపుమని చెప్పబడినది. దేనిని ఆశ్రయించి కామమును జయింపవలయునో కృష్ణుడు ఈశ్లోకముచేత వివరించి చెప్పుచున్నాడు. శ్రోత్రాదీంద్రియములు సూక్ష్మములును, లోపలనుండునవియును, వ్యాపకములును అగుటచేత, స్థూలమును వెలుపలనుండు నదియును, పరిమితికలదియును అగుదేహముకంటె శ్రేష్ఠములయినవి. ఇంద్రియములకంటె సూక్ష్మమును వ్యాపకమును అయినదగుటచేత సంకల్ప వికల్పాత్మకమగు మనస్సు గొప్పది, మనస్సుకంటె నిశ్చయాత్మకమగుబుద్ధి గొప్పది. ఇంద్రియములతోగూడుకొనిన కామము జ్ఞానమును కప్పివేసి దేహాభిమానియయిన యేపురుషుని మోహపెట్టుచున్నదో అట్టిపురుషుడు దృశ్యములయిన దేహేంద్రియ మనోబుద్ధులకన్నిటికిని ద్రష్ట (చూచువాడు) కనుక శ్రేష్ఠుడు. ఈలాగునపండితులు చెప్పుచున్నారు

---

*Notes.*

The sphere of action of the senses of perception and action is greater than that of the body, and that of the mind is greater than

that of the senses The term పంచ (five) in 'five senses' donotes the five senses of action also. "పంచేతిజ్ఞానేంద్రియవత్ కర్మేంద్రియాణ్యపి వాగాదీని గృహ్యంతే".

దేహినం:—The word దేహినం (embodied being) denotes the Atman which identifies itself with the body దేహినమితి దేహిశబ్దేన ఆత్మా; it means "దేహాభిమానీ". This is the witness which is necessarily greater than the thing witnessed.

ఏవం బుద్ధేః పరం బుధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదం॥ 43

హేమహాబాహో = ఓఅర్జునుడా, ఏవం = ఈప్రకారముగా, బుద్ధేః = బుద్ధికంటె, పరం = వ్యతిరిక్తుడైన, ఆత్మానం = ఆత్మను, జ్ఞాత్వా = తెలిసికొని, ఆత్మనా = (పరిశుద్ధమైన)మనస్సుచేత, ఆత్మానం = మనస్సును, సంస్తభ్య = నిశ్చలముగానిగ్రహించి, దురాసదం = దుఃఖముచేత పొందదగినదియును, కామరూపం = కామస్వరూపమైనదియును, (అయిన) శత్రుం = శత్రువును, జహి = చంపుము.

Thus knowing Him as higher than Budhi, controlling the *self* with the *self*, slay thou, O mighty armed, the enemy in the shape of desire, which is hard to overcome.

## Com. భాష్యం

ఏవమితి॥ ఏవం బుద్ధేః పరం ఆత్మానం బుధ్వా జ్ఞాత్వా సంస్తభ్య సమ్యక్ స్తంభనం కృత్వా స్వేనైవాత్మనా సమ్యక్సమాధాయేత్యర్థః। జహ్యేనం శత్రుం హేమహాబాహో కామరూపం దురాసదం దుఃఖేనాసదః ఆసదనం ప్రాప్తిర్యస్య తం దురాసదం దుర్విజ్ఞేయానేకవిశేషమితి॥

ఇతి శ్రీమహాభారతే శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగోనామ తృతీయోఽధ్యాయః.

Thus understanding the Parmathma as greater than Budhi and having restrained the self by the self *i e.*, having comprehended the self by means of purified mind, slay thou the enemy in the shape of desire. It is hard to overcome desire by reason of its multifarious qualities.

———.o·———

తాత్పర్యము.

ఈప్రకారముగా పరమాత్మ బుద్ధికంటె వ్యతిరిక్తుడని తెలిసికొని పరిశుద్ధాంతఃకరణముచేత, ఆత్మను తనముగా తెలిసికొని తనశత్రువును సంసారమునకు కారణమును అయిన కామమును నిశ్శేషముగా జయింపుము, కామము విషయాభిలాష మహాశనత్వము మొదలుగాగల యనేకవిశేషములు కలుగుటచేత దుర్జ్ఞేయము.

భగవద్గీతయందున్న మూడవఅధ్యాయము సమాప్తము.

## *Notes.*

The Lord concludes the subject by saying that conquest over desire can be made by the knowledge of the self, preceded by the control of the senses. "ఇంద్రియాది సమాధాన పూర్వకమాత్మజ్ఞానాత్ కామజయో భవతి".

దుర్జ్ఞేయం...మ—Several qualities of desire such as మహాశనత్వం &c. (being insatiable &c,) which are hard to conquer.

" అనేకవిశేషాః మహాశనత్వాదయో "

the obect of the 3rd Adhyaya.

The main object of the Gita is to teach the devotion to the self-knowledge. The subject of the 3rd Adhyaya, Karmayoga, is important as it is the sure means to Moksha. The means is as important as the end, so it is fully treated in the 3rd Adhyaya. It is not

incidentally introduced. The last verse has reference to the conquest of desire, as the renunciation of desire is itself Moksha; Karmayoga is ఉపాయ, and Jnana-yoga is ఉపేయ; ఉపాయభూతా కర్మనిష్ఠాప్రధానేనోక్తా, ఉపేయాత్త్తల్ జ్ఞాననిష్ఠాగుణత్వేన...

మహాబాహో —This word indicates that Arjuna is fit to conquer the foe of desire.

---



